'వనతరు వల్లికా కుసుమ వాసన లొల్లక శైలకన్యకా
ఘనతరవేణికాభరము కమ్మనితావికిఁ జిక్కి మ్రోయుచున్,
వెను చనియెన్ ద్విరేఫములు, వేమఱు భావి వియోగచింతచే
వనరుచు వెంటఁ బోవు మహీవల్లభు చూపుల ప్రోవు లోయనన్'

28 'శిఖయా' — శిఖయే దీపము, శిఖ లే దేని దీపమే లేద, శిఖచేతనే అగ్నిత్వము, అగ్నిత్వముచేత పూతత్వము కాంచన పద్మాదులచేతను, హంస చక్రవాకాదుల చేతను మందాకినికి 'విభూషణత్వము' 'గిరా'—సంస్కృత వాక్యనకు పవిత్రత్వము-

'ఏకః శబ్దః సమ్యగ్ జ్ఞాతః సుష్ఠుప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి.'
మహాభాష్యము

'కామాన్ దుగ్ధే, విప్రకర్ష త్యలక్ష్మీం,
కీర్తిం సూతే దుష్కృతం యా హినస్తి,
తాం చా ప్యేతాం మాతరం మఙ్గళానాం
ధేనుం ధీరాః సూనృతాం వాచ మాహుః.'

29 'సైకత'—ఇసుకగావున అరఁగులుగా కట్టుట సులువు. 'కన్దుకైః'— బంతితో ఒకొరి నొకరు కొట్టుకొనుట గాదు, అట్టిది బాలురక్రీడ, బంతిని నానాగతివిశేషముల తాటించుచు నాడుట. 'పుత్రకైః' — బొమ్మలకు పూర్వోక్తవేదికలే వివాహ వేదిక లగును

30. హంసశ్రేణులకు గతగ్రీష్మర్తువు, ఓషధీదీప్తులకు గతరాత్రి, ఆమెవిద్యలకు గతజన్మమును, ఇత్యాదిక మరయునది.

31 'ఆఖ్యా' — ఆసవ మను పేరే లేదు గాని దానియంతపని చేయునదియే యని భా, ఇట్లే ఇతరత్ర గ్రహించునది 'మదస్య'—మదము తనకే గాక చూపఱకును. వ్యతిరిక్తమ్' — మించినట్టి దనియు, పూములికికి లొంగనివాఁడు ఈయెలజవ్వనంపు సొంపునకు లొంగు ననియు భా 'బాల్యాత్ పరమ్'— ఈమాటచే వయస్సంధి చెప్పఁబడినది వయస్సంధి అత్యంతమనోహరం బగుటచే మహాకవులు దానిని మిక్కిలి హెచ్చరికతో మహాప్రయత్నముతో వర్ణింతురు.—

'అపక్రాన్తే బాల్యే, తరుణిమని చాగన్తుమనసి,
ప్రయాతే ముగ్ధత్వే, చతురిమణి చాశ్లేషరసికే'
న కేనాపి స్పృష్టం య దిహ వయసా మర్మ పరమం
త దేతత్ పఞ్చేషో ర్జయతి వపు రిన్దీవరదృశః' జయదేవః.

32. 'విభక్తమ్' — అయఃభివ్యంజనమును ఇతరకవులు విస్తరించిన విధము పరికింపుఁడు.—

'శ్రోణీబన్ధ స్త్యజతి తనుతాం, సేవతే మధ్యభాగః,
పద్భ్యాం ముక్తా స్తరలగతయః, సంశ్రితా లోచనాభ్యామ్,
ధత్తే వక్షః కుచసచివతాం, మద్వితీయం తు వక్త్రమ్,
తద్గాత్రాణాం గుణవినిమయః కల్పితో యౌవనేన.'
'మధ్యస్య ప్రథిమాన మేతి జఘనం, వక్షోజయో ర్మన్దతాం
దూరం యా త్యుదరం చ, రోమలతికా నేత్రార్జవం ధావతి,
కందర్పం పరివీక్ష్య నూతనమనో రాజ్యాభిషిక్తం క్షణా
దఙ్గానీవ పరస్పరం విదధతే నిర్లుణ్ఠనం సుభ్రువః,

33 'అభ్యున్నత' — ఈవిశేషణము తామరరేకులతోడి సామ్యముకొఱకు.

34 'లీలాఞ్చితవిక్రమేషు' — పద్మినీజాతిస్త్రీలు అంచయాన లనుటకు -
'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ,
త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా,
మృదు శుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసా వల్లభా పద్మినీ స్యాత్'

'ఆదిత్సుభి ర్నూపురశిఞ్జితాని' — హంసరుతము నూపురరణనమును బోలును
'పతత్త్రిణా తద్రుచిరేణ వఞ్చితం శ్రియః ప్రయాన్త్యాః ప్రవిహాయ పల్వలం
చలత్పదామ్భోరుహనూపురోపమా చుకూజ కూలే కలహంసమణ్డలీ'
నైష. (I-127.)

36 'నాగేన్ద్ర' — ఇందలివర్ణనను రామరాజభూషణకవి వసుచరిత్రలో విస్తరించినాఁడు —

'సతియూరుద్యుతిఁ జెందఁ బూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁ బాధోలవపూరితోదరములై రంభేభహస్తంబు లు
న్నతటిన్ వీడె మరుద్విభూతిఁ గదళిన్ ద్వగ్దోష మాచందలో
ద్ధతశుండాతతిఁ బాయ దయ్యెనదె వో తద్వైరమూలం బిలన్.'

38 'తన్వీ' — సన్నఁదనము 'నవ'ము గావున. స్ఫుటముగా ఏర్పడుట గర్భధారణాదికారములచేత

40 'మృణాళసూత్రాన్తరమ ప్యలభ్యమ్' — ఇట్లే రత్నావళియందును—
'పరిచ్యుత స్తత్కుచకుమ్భమధ్యాత్
కిం శోష మాయాసి మృణాళహార?
న సూక్ష్మతన్తో రపి తావకస్య
తత్రావకాశో భవతః కథం స్యాత్.'

42 'స్తన' — స్తనములును నిస్తలము లని యభిప్రాయము

46 'ప్రవాత'—దీనిచే అధిరతాప్రయుక్త మయిన చాంచల్యము సూచితము, 'అధీర'త మృగాంగనలయందు స్వాభావికము

47 'అనఙ్గః'—సామాన్యచాపమును చెప్పక అనంగచాపమును చెప్పుటచేత - అత్యంతమద మోద్దీపకముగా నుండె నని భావము 'లీలాచతురామ్'- ఈవిశేషణముచేత సౌందర్యములో నిర్వ్యాపారదశలోని యనంగచాపము ననఁగా నెంత, సవ్యాపారదశలోని యనంగచాపమునే మించె నని భావము, అనంగుఁడు విలాసిశేఖరుఁడు గాన ఆతఁడు తనవింటికి లోకములో మఱియెవరివింటికిని లేనిసొంపును సమకూర్చుకొనును, కావున అట్టి యుత్కృష్టతమచాపమును సయితము మించె నని ప్రకృతములయిన కనుబొమలయొక్క యుత్కర్ష సూచితము

51 'ప్రగల్భేఽపి వయసి' — బ్రాహ్మణకన్య కానందునను క్షత్త్రియకన్య గావునను వయఃప్రగల్భత చెప్పఁబడినది వివాహదీక్షయందు క్షత్త్రియోచితముగా కేల అమ్మును దాల్చినట్లు సప్తమసర్గలో తెలుపఁబడియున్నది

54. ఇందలి ప్రస్థవిశేషణములచే చిత్తవిక్షేపనివారకములును ఏకాగ్రతకు అత్యంతానుకూలములును అగునట్టివి పరిమళము కించిత్క్వణనము చలువ - అనుమూఁడును తెలుపఁబడినవి

## తృతీయః సర్గః.

78 'కృతోపకారేవ'— రఘువంశమునందలి సీతామూర్ఛావర్ణనము ఇందుతో సంపదించుచున్నది

'సా లుప్తసంజ్ఞా న వివేద దుఃఖం। ప్రత్యాగతాసుః సమతప్యతాన్తః ;
తస్యాః సుమిత్రాత్మజయత్నలబ్ధః । మోహాదభూత్ కష్టతరః ప్రబోధః '

## చతుర్థః సర్గః.

7 'మమ' అనుటకు బదులుగా 'రతయే' అనుటచే నీప్రాణప్రియనైన నాకు రత్యాఖ్యకు అను భావవిశేషము సూచితము

24 'సుహృద్గతామ్'—సుహృత్త్వమే దండనకు కారణ మని ధ్వని

26 'స్వజనస్య హి' ఈ శ్లోకమందే పునఃప్రథనకారణ ముపన్యస్తము

'సంతానవాహీ న్యపి మానుషాణాం । దుఃఖాని సద్బన్ధువియోగజాని
దృష్టే జనే ప్రేయసి దుస్సహాని। స్రోతస్సహస్రైరివ సంప్లవన్తే.'
ఉత్తరరామ.

## పఞ్చమః సర్గః.

5. 'క ఈప్సితార్థ'—

'జానే తపసో వీర్యం । సా బాలా పరవతీతి మే విదితమ్;
న చ నిమ్నాదివ సలిలం । నివర్తతే మే తతో హృదయమ్. శాకున్త

45, 46. 'న రత్న మన్విష్యతి &c'—

'అయం స తే తిష్ఠతి సంగమోత్సుకో
విశఙ్కసే భీరు, యతోఽవధీరణామ్;
లభేత వా ప్రార్థయితా న వా శ్రియం,
శ్రియా దురాపః కథ మీప్సితో భవేత్.' శాకున్త.

64 'మనోరథానామ్ &c' —

'స్వప్నో ను? మాయా ను? మతిభ్రమో ను?
క్లిష్టం ను తావత్ఫల మేవ పుణ్యమ్?
అసన్నివృత్త్యై త దతీత మేవ;
మనోరథానా మతటాః ప్రపాతాః' శాకున్త.

---

# కుమారసంభవశోధనము.



| పుట. | శ్లోకము. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 1 | | కోలంత | కోలత |
| 25 | 32 | ఉన్మ్మాలితం | ఉన్మీలితం |
| 53 | 10 | మాతన్యేవ | మాత్మన్యేవ |
| 58 | 18 | నధీకారాణ | నధీకారాణ్ |
| 6[illegible] | 36 | వఃపట్ట | వస్త |
| 72 | 46 | యజ్వభి | యజ్వభిః |
| 82 | 63 | నిశిత్య | నిశ్చిత్య |
| 101 | 25 | ప్రవర్త్తే | ప్రవృత్తే |
| 106 | 21 | మదోద్ధ్రతాః | మదోద్ధతాః |
| 155 | 32 | ప్రాయ | ప్రాపయ |
| 161 | 43 | హావధి | పావధి |
| 168 | 5 | మసుశాస | మనుశాస |
| 172 | 11 | కుశాఞ్కుర | కుశాఙ్కుర |
| 175 | 15 | స్తధా | స్తధా |
| 176 | 16 | దర్మ | ధర్మ |
| 178 | 19 | కాంచన | కాఞ్చన |
| 204 | 52 | కుతూహలమ్ | కుతూహలమ్, |

శ్రీ.

# వేదము వేంకటరాయశాస్త్రి,

## జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

4, మల్లికేశ్వరవీథి, ముత్యాలపేట, మదరాసు

## సంస్కృత గ్రంథములు

కుమారసంభవము—సం వ్యాఖ్య, తె పూర్ణటీక. 2 రు

అమరుకావ్యము—సం. వ్యాఖ్య, తె పూర్ణటీక. 1 రు

పంచతంత్రము. రు. 1-4అ హితోపదేశము 12అ దశకుమారచరిత్రము. 1 రు

మేఘసందేశము—సం వ్యాఖ్య తె పూర్ణటీక. 264 పు. 2 రు.

విక్రమార్కచరిత్ర తె. విపులటిప్పణము. 12 అ. బిల్హణచరిత్ర. తె. పూర్ణటీక. 6అ.

భోజచరిత్ర—తె. టిప్పణము. 8 అ. ☞ ఇదే టిప్పణము విపులతరము. 12 అ.

పుష్పబాణవిలాసము—సం వ్యాఖ్య, తె. పూర్ణటీక. 8 అ.

రసమంజరి—భానుకృతి. శృంగార విస్తరము. తె పూర్ణటీక. — 12 అ.

ప్రియదర్శికానాటిక— శ్రీహర్షకృతి సం టిప్పణము. తె. పూర్ణటీక. పద్యములును గద్యములునుంగా ఆంధ్రీకరణము సయితము. 1 రు.

శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిజంతమంజరులు—తెనుఁగున వివరణము సయితము. 4అ.

భర్తృహరిసుభాషితము—సం వ్యాఖ్య, తె సంపూర్ణటీక, పద్యములును. 2 రు.

## ఆంధ్రగ్రంథములు.

విజయవిలాసము.—సవ్యాఖ్యానము. రు. 1-8 అ.

సారంగధరచరిత్రము—పద్యకావ్యము, సవ్యాఖ్యానము. రు 1-4 అ.

ప్రియదర్శికానాటిక —వత్సరాజాంతఃపుర రసవత్తర చరిత్రము, సతాత్పర్యము. 6 అ.

ప్రతాపరుద్రీయనాటకము—సటిప్పణము. 1 రు. ఉషానాటకము.— 8 అ.

శాకుంతలనాటకము—కాళిదాస కృతికి సరియైన తెనుఁగు. 12 అ.

నాగానందనాటకము—శ్రీహర్షకృతికి సరియైన తెనుఁగు. సటిప్పణము. 8 అ.

(నాటక) గ్రామ్యభాషాప్రయోగనిబంధనము.— 8 అ.

కావ్యాలంకారచూడామణి—అలంకారము విన్నకోట పెద్దనకృతి. 1 రు.

ఆంధ్రప్రసన్నరాఘవనాటక విమర్శ. 2 రు.

పారిజాతాపహరణము— అ 4 ఇదే ☞ పెద్దయక్షరములది. 8 అ.

కథాసరిత్సాగరము—అత్యద్భుత నీతి వ్యవహార కథలు. 10 పు. 4 రు.

☞ ఇదే పూర్వభాగము రు 2-2 అ ఉత్తరభాగము రు. 2-2 అ.

జ్ఞానవాసిష్ఠరామాయణము. పద్యకావ్యము. 1 రు.